రాయబారులనుబంపిపిలువఁగల కానుకలర్పించుచుండిరనియు, విజయనగర ద్వేష్టయగు ఫెరిస్తాయే వ్రాసియున్నాఁడు. బుక్కరాజు ప్రజారంజకుఁడుగ నుండెను. ప్రజలు ప్రభువునెడ భక్తి, విశ్వాసములు గలిగియుండిరి. బుక్కరాయలు తన పరిపాలన కాలములోఁ జెఱువులను, బావులను, కాలువలను త్రవ్వించి సస్యసమృద్ధి గలుగఁజేసి ప్రజలకు సౌఖ్యమును గలిగించెను. భూమిశిస్తునుగూర్చి నియమము లేర్పఱిచెను. ఇతఁడు విద్యానగరమును విస్తరింపఁజేసెను. పట్టణమునందు భవ్యమందిరములును పెద్దవియైన గిడ్డంగులును వెలసినవి. దక్షిణ హిందూదేశమున వర్తకమునకుఁ బ్రధానస్థానమగుటంజేసి ధనికులగు వణిక్ప్రముఖు లనేకులు విజయనగరమునఁ గళాకౌశల్యముగల భవనములను నిర్మించి కాపురముండిరి. బుక్కరాయలకాలమున నీమహానగరము వీరులకును, విద్వాంసులకును రక్షిస్థానమై 'విజయనగరము, విద్యానగరము' అను నామములను సార్థకపఱచుకొని వన్నెకెక్కుచుండెను. ఫెరిస్తా వ్రాసినట్లు దేశమున నైదులక్షలజనులు సంహరింపఁబడి, రాయలు తురుష్కులచేఁ బరాభవింపఁబడి సుల్తానునకుఁ గప్పము చెల్లించుచుండెననుమాటయె సత్యమైయుండినయెడల దేశమిట్లుండుట యెట్లుతటస్థమగును? దీనికంతకుఁ గారణము బుక్కరాయలు మానధనుఁడును, సాహసికుఁడును, మహా

యోగ్యుఁడగుట మాత్రమెగాక మహామాత్యుఁడగు విద్యారణ్యస్వామి మంత్రిగనుండి కార్యముల నిర్వహించుట. తాను తనయన్నయును శైవులై శైవాగమతంత్రవేదియగు కాశీవిలాసక్రియాశక్తిగురునకు శిష్యులైనను వైదికమతమునందును నెక్కుడభిమానముగలిగి పరమతములయెడ ద్వేషము లేకయుండిరి. తాను శైవమతావలంబకుఁడైనను తనరాజ్యములోని శ్రావణబెల్గోలాయను పట్టణమునందు వైష్ణవులకును జైనులకును వివాదములు తటస్థించినప్పుడు తాను మధ్యవర్తిగనుండి యుభయుల కనుకూలముగాఁ దగవు దీర్చి సంతోషపెట్టెను. ఇతని ప్రోత్సాహము చేతనే సాయనమాధవులు వేదభాష్యమును జేసిరి.

---

## పదునైదవ ప్రకరణము.

---

### రెండవ హరిహర రాయలు.

( ౧౩౭౭ మొదలుకొని ౧౪౦౪ వఱకు )

వీరబుక్కభూపాలుని మరణానంతరమాతనికి గౌరాంబికయందు జనించిన హరిహరరాయలను పుత్త్రుఁడు రత్నసింహాసన మధిష్ఠించెను. ఇతఁడు ౧౩౭౭ మొదలుకొని ౧౪౦౪ వఱకు ప్రజారంజకుఁడై రాజ్యపరిపాలనము చేసెను. ఈతఁడు దా

తీగాత్యప్రభువుల నెల్లర నోడించి సామ్రాజ్యమునంతయు విస్తరింపఁజేసి తనపూర్వులు 'మహామండలేశ్వర, ఒడయర్' అనుబిరుదములతో మాత్రము తృప్తినొందియుండఁగా నీతఁడు తనకు లోఁబడిన మాండలికరాజు లనేకులు గప్పము గట్టుచున్నందున 'మహారాజాధిరాజ, రాజపరమేశ్వర' ఇత్యాదిబిరుదములను వహించి చక్రవర్తియయ్యెను. ఇతనిశాసనములాంధ్రదేశమునఁ నేగాక మైసూరు, దార్వాడ, కాంచీనగరము, చెంగల్పట్టు, తిరుచునాపల్లి మొదలగు ప్రదేశములందును గానంబడుచున్నవి. దీనింబట్టి యీతనిసామ్రాజ్యవైభవము విస్తారమయ్యెనని తేఁటపడుచున్నది. తనతండ్రికివలెనె సమర్థులగు మంత్రిపుంగవుల సాహాయ్యము గలదు. అట్టివారిలోఁ బ్రముఖుఁడగు మాధవాచార్యులవారి తమ్ముఁడగు సాయనాచార్యులొకరు. రెండవయతఁడు గౌడబ్రాహ్మణుఁడగు మాధవమంత్రి. మూఁడవమంత్రి మహాప్రఖ్యాతుఁడైన ముద్దపదండనాథుఁడు. నాలుగవయతఁడు గుండపదండనాథుఁడు. ఈతనిసామ్రాజ్యములోఁ బ్రఖ్యాతిగాంచిన మంత్రులయొక్కయు, సేనాధిపతులయొక్కయుఁ చరిత్రములను సంపూర్ణముగాఁ దెలుపుట కీగ్రంథము చాలదు. ఈ రెండవహరిహరరాయలకాలమున మహమ్మదీయుల విజృంభణము చాలవఱకు దగ్గినది. గుండప్పదండనాథు డాంధ్రదేశములోని కొండవీ

టిరాజ్యమును ఓరుగంటిరాజ్యమును వశముఁజేసికొనవలయు నని రెడ్లతోడను,పద్మనాయకులతోడనుబోరాడి చూచెనుగాని యాతని ప్రయత్నములు కొనసాగలేదు. గుండపదండనాథుఁడు గోవానగరమునుండి మహమ్మదీయులను తఱిమెను.

రెండవ హరిహరరాయలు పరాక్రమవంతుఁడుమాత్రమె గాక సంగీతసాహిత్యవిద్యలయందుఁ బ్రవీణుఁడు. ప్రజా సుఖైక నిరతుఁడు. దేవబ్రాహ్మణ భక్తిగలవాఁడు. అయినను నిష్పక్షపాతబుద్ధియుఁ న్యాయైకదృష్టియుఁ గలిగి మతాంతరు లగు జైనులను సైతము పరిపాలనమునం దున్నత పదవులందు నిలిపి యాదరించినవాఁడు. ఇరుగప్పదండాధిపుడను జైనపండి తుఁడు విజయనగరమున నొక జైనాలయమును నిర్మించెను. ఇతఁడే నానార్థరత్నమాలయనునిఘంటువును రచించినవాఁడు. ఇతఁడు సేనాధిపతులలో నొక్కఁడు. హరిహరరాయలు దేవా లయములకు మాత్రమె కాక బ్రాహ్మణులకును పాఠశాలల కును గూడ మాన్యములనిచ్చి పోషించినవాఁడు. ఈతనికాల మున నే విద్యారణ్యభాష్యము ముగింపఁబడినది. ఫిరోజిషా తుఘ్లక్ చక్రవర్తి డిల్లీనగరమున బ్రాహ్మణులను వారిగ్రంథములతోఁ దగులఁబెట్టుచుండఁగా దక్షిణహిందూ దేశమున రెండవ హరిహరరాయలు హిందూ మతోద్ధారణము సేయ సర్వవిధములఁ బాటుపడుచుండెను. ఇతనికి మల్లాంబిక వలన

జనించిన దేవరాయ లనునాతఁడు యువరాజుగనుండి యుదయగిరి రాజ్యమును రాజప్రతినిధియై పరిపాలించెను. అనఁగా విజయనగర సామ్రాజ్యములోఁ జేరిన యాంధ్రదేశభాగమునఁ దనతండ్రియగు రెండవ హరిహరరాయల కాలముననే౧౪౦౦ సంవత్సరము లీ యుదయగిరిరాజ్యమును బరిపాలించినవాఁడు గావున దేవరాయలకు నాంధ్రదేశమునకు నెక్కువసంబంధము గలదు.

రెండవ హరిహరరాయలు కొండవీటిరెడ్లతో మైత్రిగలిగియున్నట్లు గన్పట్టుచున్నది. ఇతఁడు తనకుమార్తెయగు హరిహరాంబను కాటయవేమారెడ్డి కుమారుఁడగుకాటయప్రభుని కిచ్చివివాహముచేసినట్లు కాటయవేముని చరిత్రమున దెలిపియున్నాఁడను.

## వినుకొండతిప్పనామాత్యుఁడు.

ఋగ్వేదియు, ఆశ్వలాయనసూత్రుఁడును, విశ్వామిత్రగోత్రుఁడును నగు వినుకొండ తిప్పనామాత్యుఁడు హరిహరరాయల రత్నభండారమునకు రక్షకుఁడుగా నుండినట్లు క్రీడాభిరామమను గ్రంథములోని యీక్రింది పద్యముల వలన విదితమగుచున్నది.

సీ. సత్యవ్రతాచార సత్కీర్తిగరిమలఁ
జందురితోడను హరిశ్చంద్రుతోడ

సభిమానవిస్ఫూర్తి నైశ్వర్య మహిమల
రారాజుతోడ రేరాజుతోడ
సౌభాగ్యవైభవ జ్ఞానసంపన్నత
మారుతోడ సనత్కుమారుతోడ
లాలిత్యనిరుపమ శ్లాఘావిభూతుల
భద్రుతోడను రామభద్రుతోడ

గీ. సాటియనఁదగు ధారుణీపాలసభల
వీరహరిహరరాయ పృథ్వీకళత్ర
రత్నభండార సాధికారప్రగల్భు
మల్లికార్జునుఁ ద్రిపురారి మంత్రివరుని."

వినుకొండ వల్లభామాత్యకవి.

క్రీడాభిరామమును రచియించిన వల్లభామాత్యకవి పైని జెప్పిన వినుకొండ తిప్పనామాత్యునికి పుత్త్రుఁడు. క్రీడాభిరామములోని యీక్రిందిపద్యమున వల్లభామాత్యుఁడిట్లభివర్ణింపఁబడి యుండెను.

"సీ. మూఁడుగ్రామగ్రాసములతోడఁ గూఁడఁగ
మోపూరుపాలించె ముల్కినాఁట
నాశ్వలాయన శాఖయందు ఋగ్వేదంబు
కరతలామలకంబుగాఁ బఠించె

బ్రత్యక్షమొనరించి భైరవస్వామిచే
సిద్ధసారస్వత శ్రీవరించెఁ
గామకాయన సవిశ్వామిత్రగోత్రంబు
వంశగోత్రంబుగా వార్తకెక్కె
గీ. నెవ్వఁ డా త్రిపురాంతకాధీశ్వరునకు
రాయనవరత్నభండారరక్షకునకుఁ
బ్రియతనూజుండు చందమాంబికకు సుతుఁడు
మనుజమాత్రుండె వల్లభామాత్యవరుఁడు.''

ఇతఁడు క్రీడాభిరామమను వీథినాటకమును రచించినట్లు గద్యములోఁ గన్పట్టుచున్నను వాస్తవముచేత నీగ్రంథమును రచించినవాఁడు మఱియొకఁడని మఱికొన్ని ప్రబలహేతువులచేత వ్యక్తమగుచున్నది. వల్లభామాత్యుఁడిందు విశేషముగా నభివర్ణింపఁ బడియెను. ఈగ్రంథమున ననేక పద్యములతో మిక్కిలి యతిశయోక్తులతో వల్లభామాత్యుని నభివర్ణించిన పిమ్మట ,,ఆమంత్రిశేఖరుండు రావిపాటి త్రిపురాంతదేవుఁడను కవీశ్వరుఁ డొనరించిన ప్రేమాభిరామ నాటకంబు ననుసరించి క్రీడాభిరామంబను రూపకంబు తెనుంగుబాసరచియించినవాఁడు'' అనువాక్యము గన్పట్టు చున్నందునను నీతఁడు వ్రాసినది కాదని స్పష్టముగాఁ జెప్పవచ్చును. దీనిని శ్రీనాథకవి వల్లభామాత్యుని పేరుపెట్టిరచించెనని గ్రంథపీఠికలో శ్రీయుత

మానవిల్లి రామకృష్ణకవి. ఎం.ఎ.గారు కొన్ని హేతువులఁగనఁబఱిచియున్నారు. శ్రీనాథుని నిజమైన వీధినాటక మిదియెకాని బజారులలోనమ్ము వీధినాటకము కాదని వీరియభిప్రాయము. ఈవీధినాటకమునకు రంగస్థలము ఓరుగల్లు. మంచనశర్మయను బ్రాహ్మణుఁడును, టిట్టిభ సెట్టియను కోమటియు నిరువురును జెలికాండ్రును,విటపురుషులునై యుండిరి.వీరిరువురునోరుగల్లునకుఁ బోయి జారిణుల సంగతి నుందురు. ఈగ్రంథమునఁ వేశ్యాభుజంగుల వృత్తములు, విధవాదుర్వర్తనములు, పూటకూళ్ళయిండ్లు, అమ్మవార్లజాతరలు, పల్నాటివీరుల యుత్సవములు, కోడిపుంజులయు, పొట్టేళ్ళయుపోట్లాటలు, ప్రతాపరుద్రుని యుంపుడు కత్తెయగు మాచల్దేవిమందిరము మొదలగునవి మిక్కిలి చమత్కారముగా వర్ణింపఁబడినవి. ఈగ్రంథముం జదివినవారికి నాకాలపు సంఘదురాచారము లీకాలమునందు వలెనె యున్నవని చక్కఁగా బోధపడఁగలదు. కవిత్వము నారికేళపాకముతో మిళితమై మిక్కిలిప్రౌఢమైయున్నను మనోరంజకమై యున్నది. ఇదిహాస్యప్రబంధ మనిచెప్పఁదగును. ఇట్టిగ్రంథమును శ్రీనాథుఁడు రచించెనన్న విశ్వసింపఁదగి యున్నది.

## ఫిరోజిషాహాతో యుద్ధము.

బహామనీసుల్తానగు మహామూద్ షాహ ౧౩౯౭ లో మరణము నొందఁగా సింహాసనమును గూర్చి దాయాదులలో

వివాదములు జనించెను. మహామూదునకు వెనుక నతనిపెద్ద కొడుకు ఘియాసుద్దీనను పదునేఁడేండ్లబాలుఁడు రాజ్యభారమును వహించినతరువాత నిరువది దినములకు నొక బానిస వాఁడులిందుపేరు చెప్పిరప్పించి వానిగ్రుడ్లు పెఱికించెను. పిమ్మట నాతని కనిష్ఠసోదరుఁడగు షామ్సుద్దీను పట్టాభిషిక్తుఁడయ్యెను. అయిదుసంవత్సరములు జరిగినతరువాత సుల్తాను దావూద్ కుమారుఁడగు ఫిరోజిషాహ యనునాతఁడు వానిని గ్రుడ్డివానినిజేసి పదభ్రష్టుని గావించి తాను ౧౩౯౭ వ సంవత్సరము నవంబరు నెల ౧౫ తేదిని సింహాసన మెక్కెను. ౧౩౯౮ వ సంవత్సరమున బహామనీసుల్తానునకును విజయనగరమురాయలకును యుద్ధము జరిగెననియు, రాయల పేరు దేవరాయలనియును ఫెరిస్తా వ్రాసియున్నాఁడు గాని శాసనములను బట్టి యీ రెండవహరిహరరాయలే పరిపాలనము చేయుచున్నట్లు గన్పట్టుచున్నది. ఫెరిస్తాయొక్క గ్రంథములో కాలవిపర్యాస దోషములు, పురుషవిపర్యాసదోషములు పెక్కులు గలవు. ఫెరిస్తా వ్రాసిన యుద్ధకథనము సత్యమైన యెడల ఫిరోజిషాహకును, రెండవ హరిహరరాయలకును జరిగియుండవలయును. సింహాసన మాక్రమించుకొనుటకై కలుబరగి నగరములోఁ గల్లోలము జరుగుటచూచి హరిహరరాయలద్దియెదుంచినసమయమని యెంచి బహామనీరాజ్యమునకుఁ దమకు

నమమనున్న రాచూరు, ముదిగల్లు దుర్గములను స్వాధీనపఱచు కొనవలయునని పుత్రసహితముగా దండయాత్రబయలు వెడలెను. అప్పుడు ఫిరోజిషాహ రాయల నెదుర్కొనవచ్చెను. అది వర్షకాల మైనందునఁ గృష్ణానది నిండుప్రవాహముతో గూడుకొని భయంకరముగా నుండెను. నది కుత్తరభాగమున తురుష్కసైన్యములును, దక్షిణభాగమున రాయల సైన్యములును విడిసియుండెను. రాయలసైన్య మధికముగ నుండుటఁ జూచి భయపడి సుల్తాను సేనానుల నెల్లరను రప్పించికర్తవ్యం బెద్దియని యాలోచింప సాగెను. శత్రువుల జయించుమార్గము నెవ్వరును జెప్పలేకపోయిరి. అంతట సుల్తానుకడ నున్నకాజీ యొకఁడు (మతగురువు) మాయోపాయమునఁ బోయి రాయలను వానికుమారునిఁ జంపివత్తునని సెలవుగైకొని సన్యాసి వేషము ధరించి నదినిదాటి సముద్రమువలెఁ బదిమైళ్లవఱకు వ్యాపించియున్న శత్రుసైన్యములోఁ జొఱఁబడి రాజపుత్రుని శిబిరముఁ బ్రవేశించెనట. అచట నొకబోగముదానిమీఁద వలపు పుట్టినట్టు నటించి తనసంగీతమువలన దానిని మెప్పించి యామెపాదములకు మ్రొక్కి తన యుద్దేశమును దెలుపక బ్రతిమాలుకొని దానిమేళములోఁ జేరి యాయాటకత్తె నాట్యమునకై రాజపుత్త్రునియెదుటకుఁ బోయినపుడు మేళములోని వానివలెఁ దానును మఱియొకఁడును కత్తులు దీసికొనిపోయి

నాట్య మాడుచున్న కాలమున మోసముచే రాజపుత్రుని సంహరించిరఁట! అది చీఁకటిరాత్రియగుటచేతఁ గల్లోలము జనించి శత్రువులు పైఁబడి నఱకుచున్నారని భ్రమించి హిందూ సైన్యములు చెల్లాచెదరయ్యెనఁట! ఈసమయమున ఫిరోజి షాహ నదినిదాటివచ్చి రాయలసైన్యముల వెంటఁబడి తఱిమెనఁట! రాయలు విజయనగరమునకు బాఱిపోఁగా సుల్తాను సోదరుఁడు దేశమును బాడుచేసి బాధింపుచుండఁ గొంతధన మిచ్చి రాయలు వానిని బంపివేసెనఁట! ఎవరిసరిహద్దులువారివే యని యేర్పాటు చేసికొనిరఁట! కాజీ భోగముదాని పాదములకు మ్రొక్కినను, చోరులకుఁ దగనట్టియుఁ నీచులకుఁ దగినట్టియు మోసకృత్యములు చేసినను ఫిరోజిషాకు లాభమేమియు లేకె యెప్పటియట్ల చేతు లాడించుకొనుచుఁ బోవుట తటస్థించెనఁట! నిజముగా యుద్ధమే జరిగి ఫిరోజిషాహకు విజయమే తటస్థించి యుండినయెడల నిట్టిసంధి జరుగుట సంభవించునా? ఫెరిస్తా వ్రాసినది విశ్వాస నీయముగాఁ గన్పట్టదు.

రెండవ హరిహరరాయలు క్రీ. శ. ౧౪౦౪ లో ఆగస్టు ౩౧ దినమున స్వర్గస్థుఁడయ్యెను. ఇతఁడు ౧౪౧౯ వ సంవత్సరమున మరణము నొందెనని స్యూయలుగారి గ్రంథము ననుసరించి నేను జీర్ణకర్ణాటరాజ్యచరిత్రమున వ్రాసినది సత్యముగాదు.

## మొదటిదేవరాయలు

(౧౪౦౬ మొదలుకొని ౧౪౨౨ వఱకు)

రెండవహరిహరరాయల మరణానంతరము రాజ్యాధిపత్యమునకై హరిహరరాయలపుత్రులైన దేవరాయలకును, రెండవ విరూపాక్షరాయలకును పోరాటము సంభవించినది. ఇట్లుభయులును రెండుసంవత్సరములు పోరాడినతరువాత దేవరాయలె తుదకు సింహాసనము స్వాధీనముచేసికొని పరిపాలనము చేయనారంభించెను. ఇతఁడు ౧౪౦౬వ సంవత్సరము నవంబరు ౫వ తేది శుక్రవారమునాఁడు పట్టాభిషిక్తుఁడయ్యెను. ఈమొదటి దేవరాయలు తండ్రికాలమున యువరాజుగనుండి యుదయగిరిరాజ్యమును బరిపాలనము చేయుచుండెను. ఈతనితో సమకాలికుఁడైన పెదకోమటివేమారెడ్డి కొండవీటిరాజ్యమును బరిపాలనము చేయుచుండెను. దేవరాయలు రాజ్యమునకువచ్చిన వెనుక నతనికొమాళ్లు రామచంద్రరాయలును, తరువాత విజయబుక్కరాయలు నుదయగిరిరాజ్యమును బరిపాలించినట్లు శాసనములంబట్టి తెలియుచున్నయది. దేవరాయని ప్రతినిధిపాలకులలో నొక్కఁడై అరగడరాజ్యమును బరిపాలించుచున్న విఠ్ఠన్న బహుపరాక్రమవంతుఁడుగ నుండెను. మాధవసాయకుల తోఁబుట్టువగు సింగాంబకుమారుఁడగు లక్కనమంత్రి (లక్ష్మీధరుఁడు) ప్రధానిగనుం

డెను. దేవరాయలు కోటలోనుండఁగా నాతని సంహరించుటకై రాజద్రోహులు కొందఱు వాడికత్తులతో సింహద్వారము జొచ్చినప్పు డితఁడే యారాజద్రోహులనుబట్టుకొని సంహరించి రాజులను సంరక్షించెను. ఇతఁడు పంపాక్షేత్రమున మాల్యవంతమను కొండకుఁ జేరినగుహలో గణపతివిగ్రహమును బ్రతిష్ఠాపించెను. దేవరాయలకాలమున మహాప్రధాని నాగన్న దండనాయకుఁడు ములువాయిరాజ్యమును, విరూపదండనాయకుఁడు గోవెగుత్తిరాజ్యమును శంకరదేవయొడయరు బరకూరురాజ్యమును, బాచపదండనాథుని కనిష్ఠసోదరుఁడగు మల్లప్ప మహాప్రధాని చంద్రగుత్తిరాజ్యమును, రాజకుమారులగు హరిహరయొడయలు వీరమల్లన్నయొడయలును భవానీనదీతీరప్రాంత దేశమును ప్రతినిధిపాలకులై పాలించుచుండిరి. వీరవిజయబుక్కరాయలు యువరాజుగ నుండెను. దేవరాయలు విజయనగరము చుట్టును బ్రాకారములను బురుజులను బెక్కింటిని గట్టించెను. నగరములోనివారికిఁ బరిశుద్ధజలము లభింపకున్నందున తుంగభద్రనుండి నగరములోనికి నొకకాలువను ద్రవ్వించెను. తుంగభద్ర కనకట్ట కట్టి యీకాలువగుండ నీరు నగరములోనికిఁ బ్రవహింపఁజేసెను. ఇట్లు జలసమృద్ధియేర్పడినందువలనఁ బుష్పోద్యానములు లతాకుంజములు వెలయుటయె గాక ఫలవంతములైన ద్రాక్షా

తోఁటలు మొదలగునవి వేయఁబడియెను. వీనిమూలమున నగరము సొంపువహించుటయెగాక నూతనముగాఁ బండ్రెండు లక్షలయాదాయము వచ్చుచుండెనఁట. ఈకాలువ యిప్పటికిని అనేకశిల్పశాస్త్రజ్ఞుల కచ్చెరువును బుట్టించుచు సురక్షితముగా నిలిచియున్నది. వ్యవసాయాభివృద్ధికొఱకు దేవరాయలు తన రాజ్యమునం దంతటను బెక్కుకాలువలను త్రవ్వించినట్లు శాసనాదులవలనఁ దెలియుచున్నది.

జన్నయసిద్ధనమంత్రి-జక్కనకవి.

ఇతనికాలమున సంస్కృతాంధ్రకర్ణాటభాష లభివృద్ధిఁ జెందినవి. సుప్రసిద్ధాంధ్రకవియగు జక్కనమహాకవి యిక్కాలమునం దుండెను. ఈమహాకవి విక్రమార్కచరిత్రమును కావ్యముగ రచించి వెన్నెలకంటి జన్నయామాత్యుని పుత్త్రుఁడగు సిద్ధనమంత్రి కంకితమును గావించెను. సిద్ధనమంత్రియును నతనితండ్రి జన్నయమంత్రియును దేవరాయలయొద్ద మంత్రులుగ నుండినట్లువిక్రమార్కచరిత్రములోని యీక్రిందిపద్యమువలనఁ దెలియుచున్నది.

" సీ. విమలవర్తనమున వేదశాస్త్రపురాణ
వాక్యార్థసరణికి వన్నె పెట్టెఁ
బరమహృద్యంబైన పద్యశతంబున
దేవకీతనయు విధేయుఁ జేసె

రసికత్వమున దేవరాయమహారాజ
కరుణాకటాక్ష వీక్షణముఁ గాంచె
కర్ణాటకటకము కలయంగ మెచ్చంగఁ
గణకవిద్యా ప్రౌఢి ఘనత కెక్క
గీ. గురులఁ బోషించె సత్కవీశ్వరుల మంచెఁ
బ్రజలఁ బాలించె భాగ్యసంపద వహించె
హరితముని ముఖ్యవంశరత్నాకరేంద్ర
చంద్రుఁడై యొప్పుసిద్ధయజన్నమంత్రి."

దేవరాయమహారాయలు రాజప్రతినిధిగ విక్రమసింహపురముననుండి యుదయగిరిరాజ్యమును బరిపాలించినకాలమున హారితసగోత్రుఁడైన వెన్నెలకంటి జన్నయమంత్రి మహాప్రధానియై యుండవచ్చును. ఈగ్రంథమునందు చామనదండాధినాథునివలన సామ్రాజ్యరమను బొందినట్లు చెప్పియున్నాఁడు. మఱియు జక్కనకవి సిద్ధనమంత్రి నిట్లభివర్ణించియున్నాఁడు.

"సీ. చిత్రగుప్తునికైనఁ జింతింప నరుదైన
గణితవిద్యాప్రౌఢి ఘనతకెక్క
నవరసంబులయందు నవ్యకావ్యంబులు
కవిజనంబులు మెచ్చఁగా నొనర్చె
నానాముత్తెములసోయగము మించినవ్రాలు
వరుసతోనిరుగేల వ్రాయనేర్చె

నాత్మీయలిపి యట్టు లన్యదేశంబుల
లిపులను జదువంగ నిపుణుఁ డయ్యె
దేవరాయమహారాయ ధీవిధేయ
మంత్రివల్లభ చామనామాత్యదత్త
చామరచ్ఛత్రశిబికాదిసకలభాగ్య
చిహ్నములనొప్పె జన్నయసిద్ధమంత్రి."

ఈసిద్ధయమంత్రి వెల్లముకొండదుర్గమున కధీశ్వరుఁడుగ నున్నట్లు గన్పట్టుచున్నది. శ్రీమద్వెల్లముకొండ భైరవునికృపా విశేషముచేత సామ్రాజ్యలక్ష్మి లభించిన దని చెప్పియుండుటయె యిందుకు దృష్టాంతము. జక్కనకవి నియోగిశాఖా బ్రాహ్మణుఁడు. తాత పెద్దన. తండ్రి అన్నయామాత్యుఁడు. ఇతఁడు ప్రసిద్ధప్రౌఢాంధ్రకవి. సిద్ధనమంత్రి జక్కనకవి నిట్లు పొగడినట్లు కవియె చెప్పుకొనియెను.

"కం. చక్కనినీదైదుష్యము
చక్కన నీకావ్యరచనచాతుర్యంబుల్
చక్కన నీవాగ్వైఖరి
చక్కన నీవంశమహిమ జక్కనసుకవీ."

## డిండిమకవిసార్వభౌముఁడు.

డిండిమకవిసార్వభౌముఁడను బిరుదాభిధానముగల యరుణగిరినాథుఁడను జగత్ప్రఖ్యాతకవి యొక్కఁడు దేవరాయల

కాలముననుఁ, ఈతని మనుమఁడు ప్రౌఢ దేవరాయలకాలము నను నుండె ననియు, యోగానందప్రహసనము మొదలగు గ్రంథములను రచించె ననియును, ఈతనికిని శ్రీనాథునకు రాయల యాస్థానమున నుద్భటమైనవివాదము పొసగి యా వివాదమున శ్రీనాథునకు విజయము కలిగి శ్రీనాథుఁడాతని విజయడిండిమమును బగులఁగొట్టించి రాయలముత్యాలశాలలో స్వర్ణాభిషేకమును బొంది కవిసార్వభౌమబిరుదము గాంచె ననియు నింతకుఁబూర్వము శ్రీనాథునిచరిత్రముం జెప్పు సందర్భమున నుదాహరించి యున్నాఁడను.

## ఫిరోజ్‌షాహాతో ప్రథమయుద్ధము.

దేవరాయలు సింహాసన మధిష్ఠించినసంవత్సరముననే ఫిరోజ్‌షాహాతో యుద్ధముఁ జేయవలసివచ్చిన దని ఫెరిస్టా వ్రాసెను గాని యుద్ధకారణముమాత్రము విశ్వసనీయము కాని యద్భుతవిషయముగా నున్నది. ముదిగల్లుపట్టణమున నొకకాపుకూఁతురు గలదఁట. ఆమెయందమును విని రాయలు మోహించి యామెను దనకిచ్చి వివాహము చేయవలసినదని తండ్రినడిగెనఁట ! అందులకువారలు సమ్మతింపరైరి. అందు పైని దేవరాయ లామెను బలాత్కారముగాఁ జెఱపట్టి గొని పోవలయునని సైన్యముతో ముదిగల్లునకుఁ బోవ గ్రామవాసు లెల్లరును గ్రామమును విడిచి పాఱిపోయిరఁట. కాఁపు

కూఁతురుగూడ బహమనీసుల్తాను దేశములోనికిఁ బొఱిపోయెను. రాయ లంత నిరుత్సాహమునొంది స్వరాజధానికినే తెంచెనఁట. ఈవార్తవిని క్రుద్ధుఁడై ఫిరోజ్‌షాహ దండెత్తివచ్చి విజయనగరమును ముట్టడించెనఁట. అంతట వాని జయించుట దుస్సాధ్యమనియెంచి తనకూఁతునిచ్చి వివాహముఁజేసి సుల్తానును వెనుకకుఁ బంపించెనఁట. ఇదియ వాస్తవమగునేని ఫెరిస్తాకుఁ బూర్వమున నున్న అబ్దుర్‌రజాకు,నసీజ్, మొదలగుచరిత్రకారు లెవ్వరైనను వ్రాసియుండరా ? రెండువందలసంవత్సరముల కావలనున్న యొక్క ఫెరిస్తాకుమాత్రము తెలియవచ్చెనా ? ఇది ఫెరిస్తాచేగల్పింపఁబడిన గాథయెకాని సత్యమైన చరిత్రాంశ మైయుండదు.

### ఫిరోజ్‌షాహతో రెండవ యుద్ధము.

ఫిరోజ్‌షాహ ౧౪౧౭ వ సంవత్సరమున నాంధ్రదేశములోని పానుగల్లుదుర్గమును రెండుసంవత్సరములవఱకు ముట్టడించియు వశపరచుకొనఁ జాలక పద్మనాయకులతోఁ బోరాడఁజాలక ముట్టడినివీడి పలాయనుఁ డయ్యెనని రెండవప్రకరణమునఁ దెలిపియున్నాఁడను. ఆసమయమును గనిపెట్టగరగా దవ సంవత్సరములో విజయనగరాధీశ్వరు డైన దేవరాయమహారాయలు ఫిరోజ్‌షాహపై దండెత్తిపోయెను. ఉభయులకును ఘోరయుద్ధము జరిగినది. ఫిరోజ్‌షాహ తప్పించుకొని

పోవుటయె దుస్తరమయ్యెనఁట. హిందువులుసుల్తానును వెంబడించి యతని రాజ్యములోఁ జొఱఁబడి యనేకులనుసంహరించి దేశమునంతయుఁ దోఁచుకొని యదివఱకుఁ బడ్డబాధలనన్నిఁటి యొక్క ఋణమును వడ్డితోఁగూడఁ దీర్చుకొనిరఁట! ఇట్టివిపత్తు సంభవించినదిగదా యని ఫెరోజ్‌షాహ మనోవ్యాధిపీడితుఁడై యాబెంగతోనే ౧౪౨౨ లో మరణముఁ జెందెనఁట.

దేవరాయలు ౧౪౨౨ లో స్వర్గస్థుఁ డయ్యెను. ఇతనికి హరిహరుఁడుఁ, విజయుఁడుఁ, మల్లన్న యనుమూవురుపుత్త్రులు గలరు. ఇందలి విజయుఁడే వీరవిజయబుక్కరాయ లను నామాంతరము వహించి యువరాజుగ నుండి తండ్రిమరణానంతరము నొకసంవత్సరము మాత్రము పరిపాలనముఁజేసి మరణముఁజెందినట్లు గన్పట్టుచున్నది. ఇతనికి దేవరాయలు (రెండవ) పర్వతి రాయఁడు మొదలగు కొమాళ్ళను హరమ్మ యను కొమార్తెయును గలరు. హరమ్మ సాళ్వతిప్పరాజున కిచ్చివివాహము గావింపఁబడియెను. పర్వతిరాయఁడు౧౪౨౪ లో మృతినొందెను. రెండవదేవరాయలు విజయనగర సామ్రాజ్యమునకుఁ బట్టాభిషిక్తుఁడయ్యెను.

## ప్రౌఢదేవరాయలు.

(౧౪౨౩ మొదలుకొని ౧౪౪౬ వఱకును)

దేవరాయలు ౧౪౨౨ వ సంవత్సరములో మృతినొందిన పిమ్మట నతనికుమారుఁడు విజయబుక్కరాయలు తండ్రిజీవిత

కాలముననే యువరాజుగ నుండినవాఁడు గావున రాజ్యాధిప త్యమును వహించి యొకసంవత్సరము మాత్రమె పరిపాలన ము చేసినట్లు గానవచ్చుచున్నది. ఇతని పరిపాలనములోఁ జెప్పఁదగిన గొప్పవిషయము లేవియును గానరావు. ఈయన యనంతర మీతనికుమారుఁడు రెండవ దేవరాయలు ౧౪౨౩ లో రాజ్యారూఢుఁడైనట్లు తెలియుచున్నది కాని నిశ్చయముగ నీరెండవదేవరాయ లేసంవత్సరమున పట్టాభిషిక్తుఁడయ్యెనో సరిగాఁ జెప్పుటకు సాధనములు గానరావు. ఈరాయలకు ఇమ్మడిదేవరాయలనియు, ప్రౌఢదేవరాయలనియు 'గజబెం టె' (ఏనుఁగువేఁట) దేవరాయలనియును, ప్రతాపదేవరాయ లనియును నూరుపేళ్లు గలవు. మహారాజాధిరాజరాజపరమే శ్వరబిరుదాంచితుఁడైనయీప్రౌఢదేవరాయల వారికాల ముననే కొండవీడు, వినుకొండరాజ్యములు కర్ణాటసామ్రా జ్యమునఁ జేరిపోయినవి. రాజమహేంద్రపురరాజ్యమునుమాత్ర మల్లాడరెడ్డిపుత్త్రులగు వేమారెడ్డియును, వీరభద్రారెడ్డి యును స్వతంత్రపరిపాలనము చేయుచుండిరి. కొండవీడు, విను కొండ, కందుకూరురెడ్డిరాజులును, పద్మనాయకులును మా త్రము ప్రౌఢదేవరాయలకుఁ గప్పములుగట్టు సామంతమండ లాధిపులుగ నుండుచు వచ్చిరి. అనఁగా నుత్తరమునఁ గృష్ణా నదీపర్యంతభూభాగమునంతయును ప్రౌఢదేవరాయలు పరి

పాలనము చేసెను. ప్రౌఢదేవరాయలు కొండవీడు వినుకొండ రాజ్యములను స్వాధీనపఱచుకొనుసందర్భమునఁ దోడ్పడి సాహాయ్యముఁ జేసినవారు తెలుఁగురాయఁడును, పంటమైలార రెడ్డియు ననునిరువురుసామంతమండలేశ్వరులు.

### తెలుఁగురాయఁడు.

ఇతఁడు శ్రీమన్మహామండలేశ్వర మేదిని మీసరగండ కఠారిసాళువరాయవిభాళమహారాజయొక్క కుమారుఁడైన శ్రీమన్మహామండలేశ్వర మేదిని మీసరగండ కఠారిసాళువ శంభురాయదేవమహారాజపుత్త్రుఁడైన శ్రీమన్మహామండలేశ్వర మేదిని మీసరగండ కఠారిసాళువధరణీవరాహ తెలుఁగురాయండుగాని మఱియొక తెలుఁగురాయఁడుగాఁడు. ఇతని రాజధాని వెలనాటిసీమలో కృష్ణానదీముఖద్వారముననున్న శ్రీకాకుళమని తెలియుచున్నది. తెలుఁగురాయనితండ్రి యగు శంభురాయఁడును సాళ్వమంగు జయించిన శంభురాయఁడును వేర్వేఱు పురుషులుగాని యొక్కరుగారు. ఈ తెలుగురాయల శాసనములు వెలనాడు, పొదిలసీమలలోను సింహాచలములోను గన్పట్టుచున్నవి. ఇతఁడు ప్రౌఢదేవరాయలపక్షమున గజపతులతోడి యుద్ధములందు రాజమహేంద్రపుర రెడ్లకు సాహాయ్యముఁ జేయు సందర్భమున నీతఁడు ౧౪౨౮ దవసంవత్సరమున సింహాద్రికిఁబోయి దానశాసనము వ్రాయించెనుగాని రెడ్లను

జయించి యీ దేశమాక్రమించినవాఁడు మాత్రము గాఁడు. ఇతఁ డాత్రేయగోత్రుఁడు. తనయవసానకాలమునందు శ్రీనాథ కవిసార్వభౌముఁడు "రంభఁగూడెఁ దెనుంగురాయరాహుత్తుండు కస్తూరికేరాజుఁ బ్రస్తుతింతు" అనియంగలార్చిన దీ తెలుంగు రాయనిగుఱించియే సుఁడీ. ఈతనికి నీకవికి నెక్కువమైత్రి యున్నట్టుగనప్పట్టుచున్నది. శ్రీనాథుఁడు తెలుగురాయనియాస్థానమునకుఁ బోయినపు డాప్రభువు నీవేమి కోరెద వనియడిగిన ప్పు డాతఁడీక్రిందిపద్యమును జెప్పెనఁట.

"ఉ. అక్షయ్యంబుగ సాంపరాయని తెలుంగాధీశ కస్తూరికా
భిక్షాదానము సేయురా సుకవి రాడ్బృందారక శ్రేణికిన్
దాక్షారామపురీవిహారవరగంధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయకుంభికుంభములపై వాసించుఁ దద్వాసనల్."

## అనంతామాత్యకవి.

ప్రసిద్ధాంధ్రకవియగు ననంతామాత్యునితండ్రి తిక్కన తెలుగురాయనికి మంత్రిగనుండెనని తెలియుచున్నది. కాఁబట్టి అనంతామాత్యకవియు నాకాలముననే యుండెను. శ్రీనాథునకు సమకాలికుఁడు. శ్రీనాథునికంటెఁ జిన్నవాఁడై యుండును. అనంతామాత్యుఁడు తనముత్తాతయగు బయ్యనామాత్యుఁడు తిక్కనసోమయాజిచేత భవ్యభారతియని పొగడ్తఁ

గన్నవాఁడని భోజరాజీయములో నీక్రిందిపద్యములోఁ జెప్పి యున్నాఁడు.

"చ. శ్రుతిఁగ్రతుకర్తనా వినుతి చేకొని పంచమవేదమైన భా
రతముఁ దెనుంగుబాస నభిరామముగా రచియించినట్టి యు
న్నతచరితుండు తిక్కకవినాయకుఁ డాదట మెచ్చి భవ్య భా
రతియనఁ బేరుగన్నకవిరత్నముబయ్యనమంత్రియల్పుఁడే"

అనంతామాత్యకవి భోజరాజీయము రసాభరణమునను గ్రంథములను రచించి ప్రసిద్ధికెక్కినవాఁడు. భోజరాజీయము చమత్కారములైన కథలు గలది. రసాభరణము శృంగారాదిరసాదులనుగూర్చి చెప్పఁబడిన లక్షణగ్రంథము. ఈతనికవిత్వము నిర్దుష్టమై మృదుమధురపదకలితమై, రసవంతమై, హృదయరంజకమైయుండును. ఇతఁడు రసాభరణమనులక్షణగ్రంథమును శా. శ. ౧౩౫౬ ఆనందసంవత్సర మాఘకృష్ణైకాదశీభౌమవాసరంబున భక్తిపూర్వకముగ ధ్రువపట్టణాధిపున కిచ్చెనని యాగ్రంథములోని యీక్రిందిపద్యమునుబట్టి తెలియుచున్నది.

"శా. జానొందన్ శకవర్షముల్ బుతుశరజ్యాలేందులై యొప్పన
య్యానందాబ్దమునందు మాఘమున గృష్ణైకాదశీభౌమయు
క్తానామామృతవేళ నీకృతి యనంతాఖ్యుండు సమ్యగ్రస
శ్రీనిండం ధ్రువపట్టణాధిపున కిచ్చెన్ భక్తిపూర్వంబుగన్."

కనుక నితఁడు క్రీ. శ. ౧౪౩౪ సంవత్సరములో నుండుట చేతఁ దెలుంగురాయనికాలమునకు సరిపోవుచున్నది.

## పంటమైలార రెడ్డి.

ప్రౌఢ దేవరాయనివిశ్వాసమునకుఁ బాత్రులైన సేనాధిపతులలో పరాక్రమవంతుఁడైన మైలారవిభుఁడొక్కఁడు. ఇతఁడతిపరాక్రమవంతుఁడు. తురుష్కులతోడను గజపతులతోడను జరిగినయుద్ధములలో రాయలకు విజయమును సంఘటిల జేయుచుండెను. ఇతఁడు సూరారెడ్డికి మునిమనమఁడును, పోతరెడ్డికి మనుమఁడును, ముమ్మడీంద్రునకు ముమ్మాంబయందు జనించినపుత్త్రుఁడునై యుండెను. ఇతనికి ధరణీవరాహుండు, చౌహత్తమల్లుండు నను బిరుదములు గలవు. ఇతని గంట వినంబడినతోడనే శత్రురాజులగుండె లదరుచుండెన వియఁట. తన యవసానకాలమునందు శ్రీనాథకవిసార్వభౌముఁడు "కైలాసగిరిఁ బండె మైలారువిభుఁ డేగి దినవెచ్చ మేరాజు దీర్పఁగలఁడు" అని యంగలార్చిన దీపంటమైలార రెడ్డిని గూర్చియేసుఁడీ. ఈమహాపరాక్రమవంతుఁడైనమైలారవిభుఁడు తన కొనఁగూర్చిన జయములకు సంతోషించినవాఁడై యొకనాఁడు ప్రౌఢదేవరాయలవారు మైలారవిభుని రప్పించి నీవేమి కోరెదవూ కోరుమని నుడివెనఁట. అందులకాతఁడు వినమ్రుఁడగుచు , దేవరా ! నాకు నగలు నాణెము లక్కఱ లేదు; గజా

శ్వాందోలికాదివాహనము లక్కఱలేదు; ధన మక్కఱలేదు. ఎవ్వరిహృదయసీమలయందు మహేశ్వరుఁడు మొదలగు దైవతములు నివసించుచున్నారో, వేదవేదాంగములు నివసించుచున్నవో, ఎవరు మతసంరక్షణాభివృద్ధికై యేర్పడినారో అట్టి బ్రాహ్మణోత్తములకు నొకచక్కని గ్రామమును దానముచేయవలసినదిగా నాప్రార్థన'యనివేడుకొనియెనఁట. అప్పుడాతఁ డాతనికోర్కె మన్నించి శా. శ. ౧౩౫౧ కీలకనామసంవత్సర మాఘమాసములో భాస్కరక్షేత్రమున హేమకూటమున నివసించు విరూపాక్షదేవునిసన్నిధిని పూరినాటిసీమలో గుండ్లకమ్మ నదియొడ్డున నుండు పోలవరమను గ్రామమునకు చేజెర్లయని పేరుపెట్టి బ్రాహ్మణులకగ్రహారముగా ధారవోసెను.

## ప్రౌఢదేవరాయని పరిపాలనావిశేషములు.

ప్రౌఢదేవరాయని ప్రభుత్వకాలములో చామనామాత్యుఁడు రెండవహరిహరరాయలచేఁగట్టింపఁబడినహరిద్రాయనునకట్టను మరలఁగట్టించెను. ఇతఁడు తనరాజ్యములోవ్యవసాయాభివృద్ధికై మంచిపనులను బెక్కులనుగావించెను. అనేకశాసనములలో నీతనిదిగ్విజయములు వర్ణింపఁబడినవి. ఇతని దండనాయకులలో మిక్కిలి ప్రసిద్ధు లిద్దరు గలరు. వారిలో లక్కణదండనాయకుఁడు సింహళము పర్యంతముగల రాజగం

భీర రాజ్యమునకుఁ బ్రతినిధిపాలకుఁడుగనుండి జనరంజకముగఁ బరిపాలనముఁ జేసెను. అన్నప్పదండనాథుఁడు రెండవయతఁడు ఇతఁడు మంగళూరు బరకూరురాజ్యములను బరిపాలించెను. ఇంకను బ్రసిద్ధులైనమంత్రులు దండనాయకులు పెక్కండ్రుగలరు. వారలసాహాయ్యముతో నీతఁడు శత్రురాజులనెల్లరను జయించుటయెగాక తురుష్కుల విజృంభణమును నూన్పుచువచ్చెను. ఇతఁడు విశేషధనమును గూడఁబెట్టవలయునని సంకల్పించెనుగాని తురుష్కులతోడను, గజపతులతోడను అనేకయుద్ధములు జరుపవలసివచ్చినందున ౮౫ కోట్లవరహాలను మాత్రము కూడఁబెట్టఁగలిగెనఁట. ఇంతియగాక రత్నభాండారముఁ బెంపగునట్లు గావించెను. ఇంతధనవంతుఁడగుటకుఁ గారణము 'క్విలన్, సిలోన్, పలికట్, పెగో, టెనాసిరమ్' మొదలగు దేశములరాజు లనేకు లీతనికిఁ గప్పముగట్టుచుండిరని 'నసీజ్' అనుచరిత్రకారుఁడు వ్రాసియున్నాఁడు. వరహా ౧ కి మూఁడురూపాయలుచొప్పున లెక్కవేసినను రాయలయొద్దను ౨౨౫ కోట్ల రూపాయలు నిలువయుండెను. మూఁడు లేక నాలుఁగులక్షల సైన్యమును, ఒకప్పుడు ఏఁడు లక్షలసైన్యమును బోషించుచు, ప్రబలురగు శత్రువులతో ఘోరముగాఁ బోరుచు నింతధనమును గూడఁబెట్టుట శ్లాఘాపాత్రముగాదా ? ఈతని ప్రభుత్వకాలములో సామ్రాజ్యము

విస్తరించి యుండెననుటకు సందియము లేదు. పారసీక దేశపు చక్రవర్తి యగు షాహరుఖ్ అనునాతఁడు అబ్దుర్‌రజాక్ అనువానిని, పోర్చుగల్ దేశపురాజు, నికోలో డెయి-కోంటి' అనునాతని ప్రౌఢదేవరాయనికడకు, రాయబారులుగాఁ బంపుటయె యీతనిసామ్రాజ్యవైభవము మహత్తరమైన దని వేనోళ్ళఁ జాటఁగలదు. ఇట్టి మహారాజాధిరాజగు ప్రౌఢదేవరాయలు బహమనీసుల్తానులతోఁ బోరాడి యోడుచుండెననియు, వారలకుఁ గప్పము చెల్లించుచుండెననియు ఫెరిస్తావ్రాసిన చరిత్రాంశములు సత్యములని విశ్వసింపఁజాలము.

## అహమ్మదుషాహాతో యుద్ధము.

ఫిరోజిషాహ ౧౪౨౨ లో మృతినొందిన వెనుక నతని తమ్ముఁడు అహమ్మదుషాహ సింహాసనమునకువచ్చెను. ఇతఁడు ప్రౌఢదేవరాయనిపై దండెత్తివచ్చి యుద్ధము చేసెనఁట! ఈయుద్ధములో రాయలు శత్రువులచేతఁ జిక్కినప్పుడు వారాతని సామాన్యజనుఁడని తలఁచియాతని నెత్తిమీఁదఁగట్టెల మోపునుంచి కొంతదూరము వెంటఁబెట్టుకొనిపోయి తురుష్కులు విడిచిపెట్టిరఁట! ఒకప్పుడు సుల్తానొంటరిగానుండుటఁ జూచి కొందఱు హిందూసైనికులాతని వెంటాడించి చావఁ బోఁగా నతఁడు తప్పించుకొని తనసైనికులతోఁ జేరుకొని

యెనఁట! కట్టకడపట హిందువులే యోడిపోయి సుల్తానునకు కొంతధనమిచ్చి సంధిచేసికొనిరఁట! ఈధనమునంతయు సుల్తానుకుమారుఁడు గొనిపోయి తండ్రికి సమర్పించెనఁట! ఇది ఫెరిస్తావ్రాసిన యుద్ధకథనముయొక్క సారము. ఇందుఁ బదునైదువేసము లబ్ధమని మనము నిశ్చయింపవచ్చుననియు, విజయనగరపు మహారాజును సామాన్యజనుఁడని తలఁచి వానిపై నిట్టిమీఁదఁ గట్టులమోపులు పెట్టుట సంభవమని సారాసారవిచారముగలవాఁ డెవ్వఁడు నమ్మఁగలఁడని కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు వారిచే రచియింపఁబడిన మహమ్మదీయమహాయుగమునందు వ్రాసియున్నారు.

అల్లాఉద్దీన్ షాహాతో యుద్ధము.

క్రీ. శ, ౧౪౩౫ సంవత్సరములో అహమ్మద్ షాహ మరణమునొందఁగా వానికుమారుఁడు అల్లాఉద్దీన్ షాహబహామనీ రాజ్యాధిపత్యమును వహించెను. ఇతఁడుపట్టాభిషిక్తుఁడైనతోడనే తనసోదరుఁడైన మహమ్మద్ ఖానునకుఁ గొంత సైన్యము నిచ్చి దేవరాయలమీఁదికిఁ బంపెనఁట! దేవరాయలు సంధిచేసికొని కొంతధనమునొసంగి వానిని సాగనంపెనఁట! ఈవిజయమునకు నుప్పొంగి మహమ్మద్ ఖానుఁడు తనయన్నమీఁదనే తిరుగఁబడి దేవరాయలసాహాయ్యమును బొందెనఁట! మహమ్మదుఖాను ముదిగల్లు, రాచూరు, విజాపురము మొదలగు దుర్గ

ములను స్వాధీనపఱచుకొనియెనఁట గాని సుల్తాను సైన్యములతో యుద్ధము జరిగినపు డోడిపోయి పలాయనుఁడయ్యెనఁట! తరువాత సుల్తాను వానియపరాధమును మన్నించి రాచూరు దుర్గాధిపత్య మొసంగెనఁట!

## రాయలు సైన్యమును బలపఱచుట.

౧౪౨౨ వ సంవత్సర ప్రాంతమున దేవరాయ లొకనాఁడు తనసరదారులను, నాయకులను, సేనాధీశులను, రాజబంధువులు మొదలగు హితుల నందఱను రప్పించి సభ చేసి రాజ్యవిస్తారము నందును, ధనసంపత్తియందును విజయనగరసామ్రాజ్యము బహమనీరాజ్యముకంటె నెక్కుడని పరదేశస్థులు సహితము విశ్వసించుచుండఁగా విజయనగరమువా రోడిపోవుటకు హేతువేమని ప్రశ్నించెనఁట! ముసల్మానులగుఱ్ఱములు మంచిజాతివనియు, విజయనగరమువారిగుఱ్ఱములు మంచిజాతివి కానందున ముసల్మానుల గుఱ్ఱములనెదుర్కొనఁ జాలకున్నవనియు నేతన్మూలమునఁ బరాజయము సంభవించుచున్నదని కొందఱు చెప్పిరఁట. తురుష్కసైన్యములో మేటివిలుకాండ్రసైన్యమధికముగా నుండుట వారికి జయముకలుగుచున్నదని కొందఱు చెప్పిరఁట! అందువలన విశేషముగా ధనము వెచ్చించి యుత్తమాశ్వములను గొని తనసైన్యములోఁ జేర్పించుటయేగాక తరువాత ప్రసిద్ధికెక్కిన రెండువేల

మహమ్మదీయ విలుకాండ్రను, ౬౦ వేల హిందూవిలుకాం డ్రను జేర్చి సైన్యమును వృద్ధి పఱచెనఁట. ఇట్లుకొత్తగా ౮౦ వేల యాశ్వికసైన్యమును ౨ లక్షల కాల్బలమును విజయనగర సైన్యముల నలంకరింపఁ జేసెను.

## రాజద్రోహులను శిక్షించుట.

ఇట్లువక్రపరాక్రముండై జనరంజకముగాఁ బరిపాలనము జేయుచుండ దేవరాయనిఁ జంపవలెనని యొకనాఁడు వాని సోదరుఁడు తానుగట్టించిన నూత్నభవనమునందు గృహప్రవేశమహోత్సవము జరుగునని ప్రకటించి రాజబంధువుల నందఱను విందునకు రమ్మని యాహ్వానపత్రికల నంపెనఁట. ఆహ్వానమును పురస్కరించుకొనిమంత్రులు, సేనానులు, రాజబంధువులు మొదలగువారెల్లరును వచ్చి సభామంటపమునఁ గూర్చుండిరఁట! ఆకాలపుమర్యాద ననుసరించి యెల్లరు నొక్కసారిగా నొక్కప్రదేశమునఁ గూరుచుండి భుజింపరాదఁట ! వారి తారతమ్యముల ననుసరించి ప్రత్యేకముగాఁ బిలువనంపుచు మోసముచేసి వారలనందఱను సంహరించుచుండెనఁట. ఈమారణకర్మముయొక్క ఘోష బయల్పడకుండ మందిరమున దుందుభులు, నగారాలు, తుత్తూరాలు, పిల్లనగ్రోవులు మొదలగు వాద్యవిశేషములు చెవులు చిల్లులువడు

నట్లుగా ప్రేరేపింపఁ జేసెనఁట ! ఇట్లనేకుల ప్రముఖులను సంహరించి యిదేవిధముగా రాయలగడ తేర్పవచ్చునని ద్రోహి యగు నాతనితమ్ముఁడు దేవరాయనికడకుఁ బోయి విందునకు రమ్మని వేఁడుకొనియెనట ! తనకి స్వస్థముగా నున్నదనియు దా నాపూట భోజనమునకు రానని ప్రైవముపలికించినట్లు రాయలుపలికెనఁట. తనప్రయత్నమంతయు భగ్నమైనదిగదా యని చింతించి రోషావేశపరవశుఁడై తమలపాకులు, పోకచె క్కలక్రిందను దాచియుంచుకొనిన వాఁడిగలకత్తిసిదీసిరాయల నుగ్రొట్టెనఁట గాని యాతఁడు సింహాసనము వెనుకకు వెల్ల కిలఁబడిపోయెనఁట ! అంత టారాజద్రోహియగు పాతకుఁడు రాయలు చచ్చెననుకొనివాని శిరస్సుఖండింపుమనితన సేవకునిక నియమించి తానంతఃపుర సౌధాగ్రము నెక్కి, 'తానేరాజు' నని ప్రకటించెనఁట. తరువాత రాయలు లేచి తన్ను జంపవచ్చిన బంటును సంహరించి యంతఃపురము వదలివచ్చి, 'నేను సజీ విన్నై సురక్షితముగనున్నాఁడను, ఆరాజద్రోహినిబట్టుకొనుఁ' డని బిగ్గఱగా మొఱపెట్టెనఁట ! అంత జను లీదారుణకృత్యమంత యును వీక్షించి గుమిగూడివచ్చి రాజద్రోహియగు నాపాత కునిఁజుట్టుముట్టి చక్కాడిరఁట. రాయలు రాజద్రోహుల నందఱనుబట్టి తెప్పించి మరణశిక్షలు విధించి నగరమునందలి రాజద్రోహవృత్తిని నిర్మూలము గావించెను.

తురుష్కులు దండెత్తివచ్చుట.

విజయనగర మిట్టిదురవస్థ పాలయ్యెనని విని బహమనీసుల్తాను అల్లాఉద్దీను ఏఁడులక్షలవరహాలకప్పము గట్టవలసినదని వర్తమానము పంపెనఁట! రాయలావర్తమానమునకు జంకక సేనలం గూర్చుకొని సుల్తానుదేశముపై దండయాత్ర వెడలెనఁట! అతఁడు తుంగభద్రానదిని దాటి ముదిగల్లు, రాచూరు, వెంగాపురమాదుర్గములనుబట్టుకొని సాగరు విజాపురమువ ఱకుఁ గల దేశము నంతయుఁ గొల్లవెట్టి బహమనీరాజ్యము నంతయుఁ గల్లోలపఱుపసాగెనఁట. సుల్తాను సేనాధిపతులగు మల్లిక్ ఆర్టిజాన్, అజీమ్ఖాన్, జమాన్ఖాన్ మొదలగు వారు తురుష్కసైన్యములం గూర్చుకొని రాయలసైన్యముతో యుద్ధము చేసిరఁట. ఈయుద్ధములోఁ దురుష్కసైన్యములకు విశేష నష్టము సంభవింపఁగా నొండొరులకు నష్టములేకుండ సంధిగావించుకొనిరఁట.

కన్యాశుల్కదురాచారమునుమాన్పుట.

ఆకాలమునందు బ్రాహ్మణులలోఁ గన్యాశుల్కదురాచారము మిక్కిలి ప్రబలియుండఁగా నీదేవరాయనికాలమున ఘూర్జరాంధ్రకర్ణాటకద్రావిడ బ్రాహ్మణు లేకమై యంతటినుండి కన్యాశుల్కముగ్రహించినవారిట్టిశిక్షలకుఁ బాత్రులగుదు రనితమలోఁదాము సిద్ధాంతము చేసికొని నాయకులగువారు ౧౫౦ మంది చేవ్రాళ్ళు చేసిదేవరాయనికి సమర్పిం

వఁగా నాతఁడాప్రకారము సమ్మతించి యాకట్టడను సంరక్షింపుచు వచ్చెనఁట !

ఇతఁడు ౧౪౪౬ వ సంవత్సరములో మృతినొందెను.

## మల్లికార్జునరాయలు-విరూపాక్షరాయలు.

(౧౪౪౬-౧౪౬౫; ౧౪౬౫-౧౪౮౫)

ప్రౌఢదేవరాయనికి పొన్నలదేవి, సింహళీదేవి యనునిరువురుభార్యలు గలరు. పొన్నలదేవివలన మల్లికార్జునరాయలును, సింహళీదేవివలన విరూపాక్షరాయలును జనించిరి. మల్లికార్జునరాయలకు ఇమ్మడిదేవరాయ లనియు ప్రౌఢదేవరాయ లనియుఁ గూడ పేళ్ళుగలవు. ప్రౌఢదేవరాయలు ౧౪౪౬ వ సంవత్సరమున స్వర్గస్థుఁడు కాఁగా మల్లికార్జునరాయలు రాజ్యారూఢుఁ డయ్యెను. తిమ్మనదండనాయకుఁ డితనికి మంత్రిగానుండెను. ఈమల్లికార్జునరాయలు గోకర్ణక్షేత్రమునందలి మతగురువులపట్ల మిక్కిలిభక్తిగలవాఁడై వారి కనేకదానములు గావించినట్లు గన్పట్టుచున్నది.

## గజపతులదండయాత్ర.

ప్రౌఢదేవరాయలు మరణమునొందినతరువాత కటకపురాధీశ్వరుండైన కపిలేంద్రగజపతిమహారాజు విజృంభించి యసంఖ్యాకములగు సైన్యములతో దండయాత్ర బయలుదేరి రెడ్డిరాజులను జయించి రాజమహేంద్రపురరాజ్యమును మాత్రమె గాక దక్షిణమున నుదయగిరివఱకుఁ గల కర్ణాటకరాజ్యమును, ఏకశిలానగరమువఱకుఁ గల పద్మనాయకులరాజ్యమును నాక్రమించుకొని యారాజ్యములఁ బరిపాలించుటకై ప్రతినిధిపాలకుల నియమించెను. పరశురామరఘునాథరాజు, వీరభద్రరాజు కంబముమెట్టు, ఓరుగల్లు సీమలఁ బాలించుటకు నియమింపఁబడిరి. కపిలేంద్రగజపతియొక్క ప్రాం సామంతులలో నొకఁడు రాజమహేంద్రపురరాజ్యమును బరిపాలింపుచుండెను. కొండవీటిరాజ్యమును బాలించుటకు గణదేవుఁడు నియమింపఁబడెను.

వినుకొండరాజ్యమును కమ్మసేనాని సాగి గన్నమనాయఁడను గన్నక్షితిపాలుఁడు పరిపాలనముచేయుచుండెను. ఉదయగిరిరాజ్యమును మాధవవర్మకులోద్భవుండైన తమ్మిరాజపుత్త్రుఁ డగుబసవభూపాలుఁడు పరిపాలనముసేయుచుండెను. వీరెల్లరును ౧౪౬౦ వ సంవత్సరమునకుఁ బూర్వముననే యీదేశములను జయించి పరిపాలించుచున్నట్లు శాసనములవలనఁ దెలియవచ్చుచున్నందున నప్పటికే యాంధ్రదేశములో మూఁడువంతులు గజపతులస్వాధీనమయ్యె నని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. కపిలేంద్రగజపతి విజయనగరముపై దండెత్తిపోయెను. కాని మల్లికార్జునరాయలు ఘోరయుద్ధముచేసి గజపతిని తఱిమివేసి రాజధానిని సంరక్షించుకొనియెను. దక్షిణదేశము నింకను నాక్రమించుకొనవలయునని గజపతిప్రయత్నించెనుగాని చంద్రగిరి రాజధానిగాఁ జేసికొని యాప్రాచీఖండమును బరిపాలనముఁజేయుచున్న సాళ్వనరసింహక్షితిపాలుఁడు మిక్కిలిబలవంతుఁడైయుండి గజపతుల నెదుర్కొని ముందునకుఁబోకుండఁ జేసెను. కపిలేంద్రగజపతి ౧౪౩౫ మొదలుకొని ౧౪౬౭ వ ఱకును బరిపాలనముఁజేసి మృతినొందఁగా వానికుమారుఁడు పురుషోత్తమగజపతి సింహాసనమెక్కి ౧౪౯౭ వఱకుఁ బరిపాలనముఁజేసెను. మల్లికార్జునరాయలకుఁ బిమ్మట నాతనికుమారుఁడు రాజ్యమునకు రాలేదు. తమ్ముఁడు విరూపాక్షరాయఁడు రాజయ్యెను. ఇతఁడు స్త్రీలంపటుఁడై, సురాపానప్రమత్తుఁడై నిరంతరము నంతఃపురములోనే యుండి ప్రజలకుఁగాని దండనాయకులకుఁగాని దర్శనమీయకుండెను. ఇతనియసమర్థతమూలమున గోవాపట్టణమును గోలుపోయెను. అసంతుష్టులైనదండనాయకులఁ బెక్కండ్రను జంపించెను. ఈతనిప్రభుత్వకాలములో పురుషోత్తమగజపతి విజయనగరముపై దండెత్తివచ్చి సైన్యములనోడించి యపరిమితధనమును సింహాసనమును దోఁచుకొనిపోయెనఁట. ఇతఁడు సాక్షిగోపాలవిగ్రహమును గొనిపోయి కటకమునఁ బ్రతిష్ఠాపించి సింహాసనమును పూరిజగన్నాథస్వామికి సమర్పించెనఁట. తఁడుఁ కాంచీపురమునుగూడ ముట్టడించి యారాజపుత్త్రికను వివాహమాడె

నట. పురుషోత్తమగజపతి తండ్రివలెనె రణశూరుఁడు. పరాక్రమవంతుఁ డగుబసవభూపాలుఁ డీయుద్ధముల నీతనికిఁ దోడునీడయై యుండెను.

## బసవభూపాలుఁడు.

మాధవవర్మవంశోద్భవుండైన బసవభూపాలుఁడు గజపతులపక్షమున నుండి ఉదయగిరిరాజ్యమును బరిపాలనముచేసెను. ఈమాధవవర్మ పంచతంత్రమునం దిట్లభివర్ణింపఁబడియుండెను.

“చం. మును బెజవాడదుర్గఁ దనముద్ధతనంబున మెచ్చఁజేసి పెం
పున రథదంతివాజిభట భూరిబలంబులచేఁ గళింగభూ
జనపతిఁ దుంచి చేవఁ దనసంతతికై మహిఁ బాడి నిల్పి క్ర
మ్మనఁ జిరకీర్తులం గనియె మాధవవర్మ తదన్వయంబునన్.”

బెజవాడదుర్గమును బరిపాలించిన మాధవవర్మ పూసపాటిరాజులకు మూలపురుషుఁడుగాఁ జెప్పఁబడి యున్నందున బసవభూపాలుఁడుగూడ పూసపాటిరాజులకుఁ బూర్వుఁడని చెప్పవచ్చును. మాధవవర్మవంశమున కొమ్మరాజు, వాతనికి అన్నలరాజు, నతనికి సింగరాజు, నతనికి పెదవల్లభ రాజును చినవల్లభరాజు, పెదవల్లభరాజున కన్నలదేవివలన సింగరాజు, తమ్మ రాజు, తిరుమలరాజును బుట్టిరి. వారలలో తమ్మభూపాలునకు వేమాజాంబ వలన బసవభూపాలుఁడు జనించెను. ఈబసవభూపాలుఁడు రణశూరుఁడు, గుణవంతుఁడు, విద్వాంసుఁడునై యుండెను. అనంతామాత్యునిపుత్త్రుఁ డగు గంగయ యనుపెసరువాయశాఖానియోగిబ్రాహ్మణుఁ డీతనికి మంత్రిగ నుండెను. దూబగుంట నారాయణకవి పంచతంత్రమును బసవభూపా లున కంకితము గావించెను. నంది సింగయ్య, ఘంట మల్లయ్య అను కవు లిర్వురు ప్రబోధచంద్రోదయకావ్యమును రచియించి అనంతామాత్యుని గంగయ కంకితము గావించిరి. శ్రీనాథకవిసార్వభౌముని మఱఁదియగు దుగ్గ నామాత్యుఁడు నాచికేతూపాఖ్యానకావ్యమును రచించి పై యనంతామాత్యు గంగయకే యంకితము గావించెను. ప్రబోధచంద్రోదయమున నీక్రిందిపద్య

ములో బసవభూపాలున కనంతామాత్యుఁడు మంత్రిగ నున్న ట్లీక్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

"సీ. మాధవవర్మ భూమండలేశ్వరవంశ
జలధికి నేరాజు చందమామ
యేరాజు నుదయశైల మెలమి విభేదించెఁ
గపటాహితమదాంధకార మడఁగ
గజపతిసురధాణి గడిదుర్గముల కెల్ల
నేరాజు వజ్రంపుఁ బోటుతల్పు
మహిమచే నేరాజు మఱపించె నలభగీ
రథపృథూరామరఘురమణుల

తే. నట్టి గుణశాలి తమ్మరాయని కుమార
వీరబసవక్షమాచక్రవిభునిచేత
మన్ననలు గాంచి మించినమహితుఁ డితఁడు
మనుజమాత్రుండె గంగయామాత్యవరుఁడు."

దగ్గుబల్లి దుగ్గనకవి.

గంగయామాత్యుఁడు దగ్గుబల్లి దుగ్గనామాత్యునితోడ నిట్లనియెనఁట.

"చ. శ్రుతులవిహారదేశములు సుస్థిరవాక్యపద ప్రమాణ శా
స్త్రతతులయిక్కు లాగమపురాణచయమ్ముల మేలిసద్మముల్
స్మృతులనివాసముల్ కవిసమీహితసత్కవితాగుణప్రసా
దితములు దగ్గుబల్లికవితిప్పయ దుగ్గన గద్యపద్యముల్."

"సీ. కవిసార్వభౌముఁడై కర్ణాట విభుచేతఁ
గనకరత్నాభిషేకములు గనిన
శ్రీనాథసుకవి కూరిమిసేయు మఱఁదివి
దుగ్గయ కవిరాజ దగ్గుఁబల్లి
తిప్పనార్యునకు సతీమణి యొప్పమ

కును దనూజుఁడవు పోతనకు నెల్లి
నామాత్యవరునకు ననుఁగుఁదమ్ముండవు
శాండిల్యగోత్రుఁడౌ సరస మతివి
తే. చెప్ప నేర్తువు కృతులు సుస్థిరముగాఁగఁ
గాన నీవిప్డు రచియింపఁ గడఁగియున్న
నాచికేతుచరిత్రంబు నాదుపేర
నంకితముసేయు కవిరాజు లాదరింప"

నంది మల్లన-ఘంట సింగయకవులు.

ఒకనాఁడు గంగయామాత్యుఁడు ప్రబోధచంద్రోదయనాటకమును పద్యకావ్యమునుగా రచియించుకవు లున్నారా యని ప్రశ్నించినప్పుడు సభ్యు లిట్లు పలికిరఁట.

"సీ. కలరు కౌశిగోత్రకలశాంబురాశిమం
దారంబు సంగీత నంది నంది
సింగమంత్రికిఁ బుణ్యశీల పోచమ్మకు
నాత్మసంభవుఁడు మల్లయమనీషి
యతని మేనల్లుఁ డంచితభరద్వాజ గో
త్రారామ చైత్రోదయంబు ఘంట
నాగధీమణికిఁ బుణ్యచరిత్ర యయ్మలాం
బకుఁ గూర్మితనయుండు మలయమారు
తే. తాహ్వయుఁడు సింగనార్యుఁడు నమృతవాక్య-
లీశ్వరారాధకులు శాంతు లిలఁ బ్రసిద్ధు
లుభయభాషల నేర్పరు లుపమరులు స
మర్థు లీకృతిరాజనిర్మాణమునకు."

## దూబగుంట నారాయణకవి.

విద్వత్సంభాషణసమయంబున నొకనాఁడు బసవభూపాలుఁడు హరిహరభక్తుండును, ఆర్యనుతుండును, ఆంధ్రకవిత్వవిశారదుండును, కులవర్ధనుండును, శాంతుండును, ప్రబంధవాచకాభరణుఁడును, బ్రహ్మయమంత్రికి నాగమాంబకును బుత్త్రుండును దూబగుంటపురశాసనుండును నగు నారయ నామధేయకవిని జూచి యిట్లనియెనఁట.

“చం. సురుచిరమైన నీకవిత సూరిసభాంతరయోగ్యతామనో
హరసరసార్థగుంఫనల నందము గావున నారనార్య సు
స్థిరగతిఁ గీర్తనొందఁగఁ జేసి సమస్తజగత్ప్రసిద్ధమై
పరఁగుచునుండ మాకొకప్రబంధ మొనర్పు ప్రియం బెలర్పఁగన్.”

× × × ×

గీ. పంచతంత్ర మనఁగ నంచితగీర్వాణ
భాష మున్ను చెప్పఁబడినయట్టి
కావ్య మంధ్రభాష గర్ణామృతంబుగాఁ
గూర్చి వలయు నీదు నేర్పు మెఱయ.”

## విజయనగరరాజ్య మన్యాక్రాంతమగుట.

రెండవదేవరాయని ద్వితీయపుత్త్రుఁడగు విషయలంపటుని విరూపాక్షరాయని నతని పెద్దకుమారుఁడగు రాజశేఖరుఁడు చంపించెను. ఈతనిని ఈతనితమ్ముఁడగు విరూపాక్షరాయలు చంపించెను. కాని యీతనిపరిపాలనముకూడ బాగులేనందునఁ బ్రజలకసమ్మతముగ నుండెను. విజయనగరసామ్రాజ్యము క్షీణదశకు వచ్చుచుండెను. అప్పు డీతనిదండనాయకులలోఁ బ్రసిద్ధిగాంచి యంతకుఁ బూర్వము బహుసంవత్సరములకు ముందే సర్వస్వతంత్రుఁడై పరిపాలనము చేయుచున్న సాళువవంశాంబుధిచంద్రుఁడగు నరసింహరాజు దండనాయకులెల్లరుఁదనకనుకూలురుకాఁగా నాతనిం జంపించి తాను ౧౪౮౭ లోఁ బట్టాభిషిక్తుఁడయ్యెను.

## సాళువనరసింహభూపాలునిచరిత్రము.

ఈసాళువవంశము చాలకాలమునుండి ప్రసిద్ధిగాంచినది. ఈవంశము వారు త్తరమునుండి దక్షిణమునకుఁ బోయినట్లు గన్పట్టుచున్నది. వీరి పూర్వులు కల్యాణనగరమునందుండి రాజ్యపరిపాలనముఁ జేసియుండిరి. వీరిచరిత్రము సాళువాభ్యుదయము, రామాభ్యుదయము మొదలగుసంస్కృత గ్రంథములనుండియు, జైమినిభారతము, వరాహపురాణము మొదలగు నాంధ్రకావ్యములనుండియుఁ గొంతవఱకు గ్రహింపవచ్చును. వీరిశాసనము లాంధ్రదేశమునఁ బెక్కులుగలవు. ఈరాజవంశము తెలుఁగువంశముగాని కన్నడవంశముగాదు. వీరిలోఁ గొందఱు ప్రథమరాజవంశమునకు బంధువులుగా నుండిరి. వీరు విజయనగరపురాజులకు గొప్పసరదారులుగానుండి రాజులకు సమరాంగణమునఁ గుడిభుజముగానుండుచు వచ్చిరి. డిండిమకవి సార్వభౌమబిరుదాంచితుఁడైన యరుణగిరినాథునిపుత్త్రుఁడగు రాజనాథకవి సాళువాభ్యుదయమును రచించి సాళువనరసింహరాజున కంకితము గావించెను. సాళువనరసింహరాజే రామాభ్యుదయమను సంస్కృతకావ్యమును రచియించెను. పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి జైమినిభారతమును తెలుఁగుభాషను రచించి యీరాజపుంగవుని కంకితము గావించెను. సాళువాభ్యుదయమునందు సాళువవంశము వర్ణింపఁబడినది. చంద్రవంశమునందు యదువు జనించెను. వానివంశమున చాళుక్యనారాయణుఁడు జనించెను. వానివంశమున వీరరాయలు, సుందరమల్లుఁడు, ఘనమల్లుఁడు జనించిరి. వీరివంశమువారికి 'పంచఘంటానినాద' అను బిరుదము గలదు. వారిధ్వజము వరాహచిహ్నము గలది. వారి ప్రధానాయుధము కఠారి. కావున 'కఠారిరాయ, ధరణీవరాహ' యను బిరుదములు వారికిఁ గలవు. వీరివంశమున జనిగుండదేవుఁడు జనించెను. వీనిరాజధాని కల్యాణపురము. ఇతఁడు మహమ్మదీయసుల్తానుని జయించెను. ఇతనికి కమలాదేవియను భార్యవలన గుండయ, సాళువమంగిదేవుఁడు, సావిత్రిమంగిదేవుఁడు, బలుఁడు గౌతయ,

ఆదిరాజు నను నార్వురుపుత్త్రులు జనించిరి. వీరలలో సాళువమంగిదే వుఁడు మిక్కిలి ప్రసిద్ధుఁడుగా నుండెను. జైమినిభారతమునం దిట్లభివర్ణింపఁబడియెను.

"సీ. దురములో దక్షిణసురతాను నెదురించి
కొనివచ్చి సంపరాయనికి నిచ్చె
సామ్రాజ్యమున నిల్పి సాంపరాయస్థాప
నాచార్యబిరుదవిఖ్యాతిఁ గాంచె
శ్రీరంగవిభుఁ బ్రతిష్ఠించి యర్వదివేలు
మాడ లర్ధేవునుమ్మడికి నొసఁగె
మధురాసురతాణు మడియించి పరపక్షి
సాళువబిరుదంబు జగతి నెఱపె

తే. గబ్బితనమునఁ దేజిమొగంబు గట్టి
తఱిమి నగరంపుగవనులు విఱుగఁ ద్రోలి
తాను వ్రేసినగొరు నుద్దవిడిఁ దెచ్చె
సాహసంబున నుప్పాంగు సాళ్వమంగు"

వీరబుక్కరాయలపుత్త్రుఁ డగుకంపరాయలు దక్షిణదిగ్విజయ యాత్రకు బయలువెడలినప్పు డాతనిమంత్రియగు చెంజీదుర్గాధ్యక్షుఁడగు గోపన్నమంత్రికి దండనాథుఁడుగ నుండి వారలతో మధురాపురముపైకి దండెత్తిపోయెను. గోపనమంత్రి యాజ్ఞానువర్తియై యుండె నని దక్షిణార్కాడుమండలములోని దలవనూరుశాసనముంబట్టి దెలియుచున్నది. జయంతి రామయ్యపంతులుగారు ఎపిగ్రాఫియా ఇండికా ౭ వ సంపుటములో దేవులపల్లిశాసనముం బ్రచురించి యందు జైమినిభారతములోఁ జెప్పిన పైవిషయములను దప్పుగా నిర్ధారణచేసియుండిరి. సాంపరాయలు తెలుఁగురాయనితండ్రి యనియును, అతఁడు సాళ్వమంగువంశములోని వాఁడే యనియును, దక్షిణసురతాను బహమనీసుల్తాననియు, మధురాసుర

త్రాణాపాండ్యరాజనియు, శ్రీరంగము మైసూరుదేశములోని శ్రీరంగప ట్టణమనియును దెలిపిరి కాని యవియున్నియును సరియైనవికావని కంప రాయచరిత్రమువలనను, సాళువాభ్యుదయమువలనను, దలవనూరుశాసనము లవలనను మనకు స్పష్టపడుచున్నది. శ్రీరంగమునం దురకలబాధలవలనఁ బ్రజలు లేచిపోఁగా నగ్రహారములనిచ్చియు, బ్రాహ్మణులకు వసతుల నేర్ప ఱచియు, ధనమునొసంగియు, శ్రీరంగమునుద్ధరించి శ్రీరంగస్థాపనాచార్య బిరుదమును వహించెనని సాళువాభ్యుదయమున వర్ణింపఁబడియెను. గౌ తరాజునకు గుండ్రాజు జనించెను. గుండ్రాజునకు మల్లాంబికవలన నర సింహక్ష్మాపాలుఁ డుదయించెను. ఇతఁడహోబలనృసింహస్వామిప్రసాద మున జనించుటచేతఁ దల్లిదండ్రులు నరసింహుఁడని పేరిడిరి. ఇతఁడు కళింగదేశాధిపతియైన పురుషోత్తమగజపతి పెనుగొండదుర్గమును ముట్ట డింపఁగా నాతనినోడించి తఱిమెను. అవక్రపరాక్రముఁడై విజయనగర రాజ్యమును బరిపాలించెను. ఇతఁడు వృద్ధుఁడైనందున చక్రవర్తియైనపి మ్మట విశేషకాలము పరిపాలనము చేసియుండలేదు. ఇతనికి నారాయణ వనము చంద్రగిరి మొదటరాజధానులుగ నుండెను. తరువాత విజయనగర మునందుఁ బరిపాలనముఁ జేసెను. ఇతనికి నాదిండ్లచిట్టి గంగనామాత్యుఁడు మంత్రిగనుండినట్లు దెలియుచున్నది.

## రాజనాథకవి.

యోగానందప్రహసనమును రచించి దేవరాయలకాలమున బ్రఖ్యా తివహించిన డిండిమకవిసార్వభౌమబిరుదాంచితుం డగునరుణగిరినాథు నకు రాజనాథదేశికుఁడను కుమారుఁడు గలఁడు. ఈతనికిని డిండిమకవిసా ర్వభౌముఁడను బిరుదము సంక్రమించినది. ఈతఁడే సాళ్వాభ్యుదయమను పదునాల్గుసర్గముల కావ్యమును రచించినవాఁడు. విద్యానగరరాజ్యమును వశపఱచుకొని ౧४౯3 వఱకుఁ బరిపాలించిన సాళువనృసింహసార్వభౌ ముని ప్రాభవములిం దభివర్ణింపఁబడినవి. బిరుదకవిప్రపితామహుఁడు, దశ

యావనారాయణబిరుదమండనుఁడు, రసికకవితాసామ్రాజ్యలక్ష్మీపతి, నవనాటకభరతాచార్యుఁడు, కవిమల్లగల్లనాటనపటు, ప్రతిభటకవికుంజరపంచానన బిరుదమండనుఁడు, చేరచోళపాండ్య పరిథమారాధ్య హృదయశివాభిఖ్య డిండిమకవిసార్వభౌమబిరుదశోణాధినాథాత్మజుఁడు, ద్వాదశదేశవ్యాప్తిపారదృశ్యనుఁడు, అష్టభాషావరమేశ్వరుఁడు, అభినవనాటకభవభూతి, చిత్రప్రబంధపరమేశ్వరుఁడు, అష్టదిగ్విజయపటహీకృతబిరుద డిండిమాడంబరుఁడు, శైవశాస్త్రజీవాతు మొదలగు బిరుదవిశేషములు గలిగియున్న ట్లాకావ్యమువలనఁ దెలియుచున్నది.

పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి.

పిల్లలమఱ్ఱి పినవీరన్న నియోగిబ్రాహ్మణుఁడు; గాదయామాత్యపుత్రుఁడు, భారతీతీర్థుల శిష్యుఁడు, నిరుపమానమైన కవిత్వధారగలవాఁడు. ఒకనాఁడు సాళ్వనరసింహభూపతి నిండుకొలువుండి సభాసదులను జూచి;—

"కం. నామది నిరతము భారత
రామాయణకథలఁ ప్రేమరంజిలు నందున్
జైమినిభారత మనఁగా
భూమి నపూర్వము పురాణముల గణియింపన్

గీ. ఆపురాణంబు గనఁ దెనుఁగయ్యెనేని
చెప్ప నేర్చినకవియుఁ బ్రసిద్ధుఁడేనిఁ
దెనుఁగునుడికారమునమించు గనియెనేని
గుందనము కమ్మవలచిన చందమగును."

అని పలుకఁగా నాతనిచిత్తం బెఱింగి సభాసదు లిట్లనిరఁట.

కం. తాతయుఁ దండ్రియు నగ్ర
భ్రాతయునుం దాను భువనభానురకృతిని
ర్మాతలు పిల్లలమఱ్ఱి వి
ఖ్యాతుని పినవీరుఁ బోలఁగలరే సుకవుల్."

"సీ. అమృతాంశుమండలం బాలవాలముగాఁగ
మొలచె నొక్కకోటి జగన్మోహనముగ
జిగిరించెవిలయసింహగతక్కైతవడింభ
శయనీయ వటపలాశములతోడ
పితృదేవతలకు నంచిత సత్రశాలయై
చెట్టుగట్టెను గయాక్షేత్రసీమ
నిలువ నీడయ్యె నిందీవరప్రియకళా
కోటీరునకు భోగికుండలునకు
మట్టిమాత్రంబె పిల్లలమట్టి పేరు
పేరుపలెఁగాదు శారదాపీఠకంబు
వారిలోపలఁ బినవీరువాక్యసరణి
సరసులకునెల్లఁ గర్ణరసాయనంబు"

ఈతనింగూర్చి యనేకవిధములైనఁ గాథలుగలవు. వానినెల్లఁ గవిజీవితములందుఁ జదువుకొనవలయును.

## రాజధర్మప్రబోధ.

సాళ్వగుండ నరసింహభూపతి విద్వాంసుడును ధర్మప్రభువు నగుటచేత నీతనిపేరిట నవరత్నములు మొదలగు పద్యములురచింపఁబడినవి. చాటుపద్యమణిమంజరిలో నుదాహరింపఁబడినవాని జదువరులకుఁదెలియుటకు నీక్రింద నుదాహరించుచున్నాఁడను

## నవరత్నములు.

"సీ. దినదినంబును నెల్లదివిజులఁ బోషించుఁ
గైరవబంధుఁ డేకార్యకాంక్ష?
అప్పటప్పటికి లోకాంధకారము మాన్చ
నినుఁ డేమిలాభంబు నిచ్చగించి?
సచరాచరంబైన జగతియెల్ల భరించు

ఫణిపతి యేఫలప్రాప్తిఁ జూచి ?
అవనిన వర్షించి యఖిలజీవులఁ బ్రోచు
జలధరం బేప్రయోజనము గోరి ?
గీ. పరహితం బాత్మహిత మని పరమపుణ్యు
లన్యు లొనరించు మేలు తా రాసపడరు
సకలభాగ్యోదయ ! కఠారిసాళువాంక !
గుండభూపాలునరసింహమండలేంద్ర !
సీ. ఆకారసంపద ననుకరించినవిద్య
విద్యకుఁ దోడైన వినయగుణము
వినయగర్భితమైన విక్రమారంభంబు
విక్రమార్జితమైన విభవగుణము
విభవానుగుణమైన వితరణోత్కర్షంబు
వితరణోపేతమై వెలయుప్రియము
ప్రియవచోనిరతమై పెంపొందు సత్కృతి
సత్కృతిఁ జేకొన్న చారుకీర్తి
గీ. చారుకీర్తికి నెలవైనపౌరుషంబు
పౌరుషంబున నార్జించు భాగ్యభూమి
భూమిపాలించు నృపతికి భూషణములు
గుండభూపాలునరసింహమండలేంద్ర !
సీ. సర్వజ్ఞుఁడగుమంత్రి సవదరించినరాజు
కార్యఖడ్గమ్ములక్రమ మెఱుంగు
కార్యఖడ్గమ్ములక్రమ మెఱింగినరాజు
బహువిధంబుల మూలబలముఁ గూర్చు
బహువిధంబుల మూలబలముఁ గూర్చినరాజు
శత్రుల సవలీల సంహరించు
శత్రుల సవలీల సంహరించినరాజు

ధరణి యేకాతపత్రముగ నేలు

గీ. కావున మహాప్రధానాగ్రగణ్యబుద్ధి
యధిపుసామ్రాజ్యమునకు సర్వాంగరక్ష
రాయమలవారగండ ! వీరప్రచండ !
గుండభూపాలునరసింహమండలేంద్ర !

సీ. సంగీతధర్మంబు సాహిత్యధర్మంబు
తెలియ నేర్చుట ప్రజ్ఞగలఫలంబు
వితరణప్రౌఢియు వినయసంబోధియు
గైకొంట సంపదగలఫలంబు
కుజనశిక్షణమును సుజనరక్షణమును
గల్గుట నిజశక్తిగలఫలంబు
బ్రాహ్మణభక్తియుఁ బరహితశక్తియుఁ
గావించు విభవంబుగల ఫలంబు

గీ. బట్టు విప్రుండు విద్యార్థి పరఁగ దాత
కిదియ లక్షణ మెన్నంగ నెలమి నెపుడు
సాళువక్షోణిపతివంశజలధిచంద్ర !
గుండభూపాలునరసింహమండలేంద్ర !

సీ. బంగారునకు సౌరభము జనించినయట్లు
కులజుఁ డుత్తమగుణకలితుఁ డేని
కస్తూరి నికరంపుఁ గాంతిఁ జెందినయట్లు
లుత్తమోత్తముఁడు శ్రీనొందెనేని
భావింపఁ జెఱకునఁ బండు పండినయట్లు
నెఱదాత ప్రియవచోనిరతుఁ డేని
అలరుగందపుమ్రాన నలరుపూచినయట్లు
శ్రీమంతునకుఁ గీర్తి చెందెనేని

గీ. ధన్యగుణసాంద్ర ! సకలవైభవసురేంద్ర !

సహజదానశిబీంద్ర! భాషాఫణీంద్ర!
సాళువక్షోణిపతివంశజలధిచంద్ర!
గుండభూపాలునరసింహమండలేంద్ర!

సీ. వాహ్యాళిచో మత్తవారణనూకరా
  శ్వముల గన్గొనుచోట సాముచోట
ఆరగించెడిచోట నాయుధంబులచోట
  నిద్రపోయెడిచోట నెలంతచోట
వేఁట వెళ్లెడిచోట విందుచెప్పినచోట
  నాటపాటలవేడ్క నలరుచోట
వైద్యుచే (                )నిఱికటం బైనట్టి
  తెరువున నని మొనల్ దీర్చుచోట

గీ. దైవతస్థానవైభవ తతులచోటఁ
గ్రొత్తవారలఁ గాన్పించుకొనెడుచోట
నాత్మరక్షయే మఱువకుండునతఁడె రాజు
గుండభూపాలునరసింహమండలేంద్ర!

సీ. ప్రియముతో నిజమాతృపితృభక్తి యొనరించు
  ధర్మాత్ములకు వేఱె దైవ మేల
మమతమై సర్వభూతములందు దయగల్గు
  ధన్యులకును వేఱె తపము లేల
సరససత్కవికావ్యసరణి వినోదించు
  నతిపుణ్యులకు వేఱె యమృత మేల
సతతంబు సత్యభాషానిష్ఠ విడలని
  కృతకృత్యులకు వేఱె క్రతువు లేల
ప్రాణపదమైన లలితాంగిఁ బాయకుండు
పురుషులకు వేఱె దేవేంద్రపురమదేల

రాయచౌహత్తమల్ల ధరావరాహ
గుండభూపాలునరసింహమండలేంద్ర.

సీ. ధనికులఁ గావింపఁదగదు సోదర్యుల
బడవాలుఁ జేయఁ జొప్పడదు కుటిలు
తగదు దుర్గాధిపత్యము జ్ఞాతికొసఁగంగ
ధనము కావలిఁ బెట్టఁదగదు ఖలుని
దేశాధికారిఁగాఁ ద్రిప్పనొప్పదు క్రూరుఁ
జనవు ప్రమాదంబు సాహసునకు
కాదు భీరుఁదలారికము ప్రతిష్ఠింపఁగఁ
గీడు వంచకుని వాకిటను నిల్ప




గీ. నమ్మ ననుమాన మగువాని నమ్మఁ ద
నమ్మియుండిన కోట వ్రణంబు గని
వ్రణమునకుఁ దగఁజేయంగ వలెఁ జి
గుండభూపాలునరసింహమండలేంద్ర.

సీ. మంత్రాధిపునితోడ మర్మజ్ఞుతో రాజ
హితునితోడను నిగ్రహింపఁ జనదు
అతిమదాంధునితోడ నంగనాసక్తుతోఁ
జెనకుతోఁ దనయాత్మ చెప్పఁదగదు
నిందితుతోఁ బరనిందాభిలాషితోఁ
గ్రూరకర్ముని తోడఁ గూడఁ జనదు
రాజవిద్వేషితో భూజనద్రోహితో
వంచకుతోఁ బొత్తు వలదు సేయ

గీ. పరఁగ నీరీతి జరియించు నరవరునకు
నూర కెవ్వారు మార్పులై వైరులగుచు
నడచి లేని యపశ్యంబు చేడకపోరు
గుండభూపాలునరసింహమండలేంద్ర.''